# బొమ్మరిల్లు

[ పిల్లల గేయకథల సంపుటి ]





రచన:

కవిరావు



చిత్రరచన:

జి. వి. సుబ్బారావు, బి. ఎ.



సంపాదకులు:

ముమ్మనేని చలపతిరావు



శ్రీ

ఆపుల

గోపాలకృష్ణమూర్తి

గారికి

IV

జోతలు :

శ్రీ బోడేపూడి వేంకటరావుగారికి

శ్రీ కొడాలి లక్ష్మీనారాయణగారికి

---

ముద్రణ :

బి. యన్. కె. ప్రెస్

37, ఆచారప్పన్ వీధి

జార్జిటౌను :: మదరాసు.

V

# కృతజ్ఞత:

ఈ గేయ రచనలను తమ పత్రికలలో
ప్రచురించి, పాఠకలోకానికి నన్ను పరిచయం
చేసి, పునర్ముద్రించుకొనుట కనుమతించిన.

శ్రీ యుతులు

| | |
|---|---|
| నాగిరెడ్డి, చక్రపాణి | ( చందమామ ) |
| శివలెంక శంభుప్రసాద్ | ( ఆంధ్రపత్రిక ) |
| నార్ల వెంకటేశ్వరరావు | ( ఆంధ్రప్రభ ) |
| ఈదర వేంకట్రావు పంతులు | ( ప్రారంభవిద్య ) |

గార్లకు.



# సంపాదకీయం

నేటి బాలలే రేపటి పౌరులు. కనుక నేటి మన ప్రయత్నాలన్నీ రేపు పౌరులు కాబోయే బాలబాలికలను తీర్చి దిద్దేవిగా వుండాలి. అందుకే సమాజ పునర్నిర్మాణాన్ని కాంక్షించే ప్రతివారు, పసిపాపలు పానం చేసే పాలల్లో పాషాణం కలవకుండా చూడాలి. నామట్టుకు నేను రచనలన్నీ పిన్నలకే చేయాలంటాను. చదువుకొని, సమాజాన్ని సక్రమ పంథాలో నడిపించుటకు తగిన వ్యవధి వారికుంది. కాటికి కాళ్లు చాచుకొన్న కర్కశ హృదయాలకు, కవిత్వాన్ని కాలాన్ని వ్యర్థం చేయటం అర్థం లేదంటాను.

మన భాషలో బాలసాహిత్యం చాల వెనుకబడి వున్నదన్నమాట అందరు అంగీకరిస్తారు. కారణం? కాలప్రవాహాన్ని గమనించని కవిపుంగవులు తాతలనాటి పాత తాటాకు పుస్తకాలను త్రిప్పి త్రిప్పి వ్రాస్తూవుండమే. రెండవది ప్రభుత్వంవారి నిర్లక్ష్యం. బాల రచనలకు తగు పారితోషికాలు నిర్ణయించి ఉత్తమ రచనలు వెలువడేలాగా చూడాలి. గ్రామగ్రామాన బాల గ్రంథాలయాలు స్థాపించి పిల్లల మానసికాభివృద్ధికి తోడ్పడాలి. స్వతంత్ర ఆంధ్ర రాష్ట్రం ఆ కొఱత తీర్చగలదని ఆసిద్దాం.

తెలుగు బాల.సాహిత్యంలో కవిరావుగారొక నూతనాధ్యాయాన్ని ప్రారంభించారనవచ్చును. వారు విప్లవ భావకులు. ఆయన పిల్లలకు వ్రాసిన కొన్ని గేయకథలను ఒక సంపుటిగా వెలువరించగలిగినందుకు సంతోషిస్తున్నాం. నిత్యం జనసామాన్యంలో వాడుకునే సామెతలకు రూపం కల్పించి, సమాజ పరిస్థితులకు అన్వయింపజేశారు. ఈ విధానంలో కవిరావుగారే మార్గదర్శకులు. పిల్లలకు కావలసిన నీతి, చక్కని హాస్యం మనకీ గేయాల్లో కనుపిస్తుంది.

తెలుగులో సర్వాంగ సుందరమైన పిల్లల పుస్తకాలు లేని లోపాన్ని తీర్చాలని మేమెంతో ప్రయాసపడ్డాం. మా కృషిలో యే లోపంవున్నా దయతో తెలియజేస్తే పునర్ముద్రణలో సవరించుకొనగలమని విన్నవించుకొంటున్నాం. నూతనాంధ్రరాష్ట్రావతరణంతోపాటీ పుస్తకం వెలువడటం యావదాంధ్ర బాలసాహిత్యానికే శుభసూచన కాగలదని నమ్ముతున్నాం. ఆంధ్ర ప్రజానీకం మా ప్రయత్నాన్ని అభినందించగలదని ఆశిస్తున్నాం.

తెనాలి,
16-6-1953.

ఇట్లు
సంపాదకుడు
'చలపతి'

# పీఠిక

నేను ప్రారంభించి, ముగించలేక విడిచిపెట్టిన ఒక గేయంలో మొదటి భాగా లిది:

"కొయ్య బొమ్మకు కోక లెందుకు ?—
మురియునా అది ముద్దుతల్లీ"

"కోక కట్టిన, రైక తొడిగిన
కులుకుతూ ఇది పలుకు నమ్మా"

ఔను, పిల్లలు పలకరిస్తే పలకని బొమ్మే లేదు. ప్రాణంలేని బొమ్మలతోనే ముచ్చట లాడగల పిల్లలు పిల్లికూనతో, కుక్కపిల్లతో, లేగదూడతో, నక్కబావతో, చిట్టి పిచ్చుకతో, కాకమ్మతో, నేస్తం కట్టడం అబ్బురమా? పెద్దవారికి వారి వాస్తవిక ప్రపంచంకంటె పిల్లలకు వారి కల్పనా జగత్తే ఎక్కువ వాస్తవమైంది. అభూత కల్పనలతో, అద్భుత విషయాలతో, అపూర్వ సన్నివేశాలతో, నిండిన ప్రపంచానికి వారు పాతకాపులు కాబట్టే "పంచతంత్రం" ప్రపంచం మొత్తంమీదనే బాలసాహిత్యంలో అగ్రస్థానాన్ని సంపాదించుకో గలిగింది. "పంచతంత్రం" లోని కథలకున్న ప్రచారం మరి వేటికీ లేదని ఆర్థర్ రైడర్ వ్రాశాడు. దానిలోని కథలను మించినవి ప్రపంచ కథాసాహిత్యంలోనే లేవని అంటే, దాన్ని కాదనడం సులభంకాదనికూడా ఆయన ఉద్ఘాటించాడు. రైడర్ అభిప్రాయాన్ని హేతువాదం చేసేవారు అంగీకరించకపోవచ్చు. కాని హేతువాదానికి, శైశవ హృదయానికి పొద్దెదురు. తమ భావిపౌరులను హేతువాదం ప్రకారం రూపొందించాలని సోవియట్ రష్యాలో కొంతకాలంపాటు పిట్టకథలను నిషేధించారు. తమ చర్యవల్ల పిల్లలలో హేతువాదం పెంపొందకపోగా, వారి భావనాపటిమ నశిస్తున్నదని గ్రహించడానికి సోవియట్ పాలకులకు ఎంతోకాలం పట్టలేదు. నేటి సోవియట్ బాలసాహిత్యంలో అగ్రతాంబూలం పిట్టకథకే.

పిట్టకథ అంటే పిల్లలు చెవికోసుకుంటారు సరిగదా, అది పద్యరూపంలోనో, గేయరూపంలోనో వుంటే దాన్ని మరింత తేలికగా పట్టుకుంటారు. ఏదో అజ్ఞాతలయ వారి లేతహృదయాలలో నర్తిస్తూ వుంటుంది వ్యక్తి శైశవావస్థలోనేకాక, జాతి శైశవావస్థలో కూడా లయకే ప్రాధాన్యం. అందువల్లనే ఏజాతి చరిత్ర చూచినా ముందుపాట, లేదా పద్యం; ఆ తర్వాతనే గద్యం. గద్యాత్మకమైన బాలసాహిత్యంకంటె పద్యాత్మకమైన

దానికే ఈ కారణాన విలువ హెచ్చు. "పంచతంత్రం" కథలే ఈసబ్ కథలుగా మారగా, ఈసబ్‌కథలను పదిహేడవ శతాబ్దిలో ల ఫాంటొన్ అనే ఫ్రెంచి కవి పద్యాలలో పెట్టాడు. ఫ్రాన్సులో ల ఫాంటొన్ కున్న ప్రచారంలో నూరవవంతైనా ఈసబ్‌కు లేదు. ఈ శతాబ్దిలో సర్ ఎడ్వర్డ్ మార్షల్, ల ఫాంటొన్ రచనను ఇంగ్లీషులోకి అనువదించాడు. (ఎవ్విర్ మన్సు లైబ్రరీ—నంబర్ 991)

మనకు బాలసాహిత్యమే తక్కువ కాగా, పద్యాల రూపంలోను, గేయ రూపంలోను వెలువడినట్టిది మరీ తక్కువ. ఈ లోపాన్ని తీర్చడానికి శ్రీ వీరేశలింగం పంతులుగారు స్వయంగా కృషిచేశారు. అయితే, ఆయన సాధించగలిగింది ఈసబ్ కథలను, పంచ తంత్రాన్ని తెనిగించటం వరకు మాత్రమే. ఈ సాహిత్యరంగానికి సంబంధించినంతవరకు ఆధునికులలో తర్వాత ఎన్నపలసినవారు శ్రీ చింతా దీక్షితులుగారు. ఈయన విశిష్ట రచనలే సాగించారు కాని, వాటి బాహుళ్యం తక్కువ. ఇటీవల పిల్లలకోసం కొన్ని పత్రికలు ప్రత్యేకంగా ప్రారంభమై ("బాల", "చందమామ" మొదలైనవి) జయ ప్రదంగా నిర్వహించబడుతున్నందున, కొన్ని వారపత్రికలలో బాలబాలికలకు కొన్ని పుటలను ప్రత్యేకిస్తున్నందున బాలసాహిత్యం పెంపొందుతున్నది. త్వరితంగా పెంపొందు తున్న ఈ బాలసాహిత్యరంగానికి శోభకూర్చుతున్న వారిలో నా మిత్రులు కవిరావుగా రొకరు. ఆయన నవయువకుడైనా శైశవ సహజమైన భావనాబలం వున్నవారు. అందువల్లనే శైశవ హృదయాలనే కాక, వాటికి దూరంకాని పెద్దల మనస్సులనుకూడా అలరించగల విధంగా ఆయన "బొమ్మరిల్లు"ను రచించగలిగారు. కవిరావుగారికి నా ధన్యవాదాలు. ఈ విధమైన రచనలను ఆయన మరెన్నింటినో చేసి ఆంధ్రజాతికి ల ఫాంటొన్ కావాలని కోరుతున్నాను; కాగలరని ఆశిస్తున్నాను.

"బొమ్మరిల్లు" మరొక వైశిష్ట్యం దానికి మిత్రులు శ్రీ జి. వి. సుబ్బారావుగారు కూర్చిన చక్కని చిత్రాలు. ఈ చిత్రాలతో, ముచ్చటైన అచ్చుతో కులుకుతున్న "బొమ్మరిల్లు"ను చేత పుచ్చుకొనడమే నా మట్టుకు నాకు ఒక పండగవలె వున్నది.

మద్రాసు,
24-6-'53

నార్ల వెంకటేశ్వరరావు
("ఆంధ్రప్రభ" సంపాదకులు)

IX

# పరిచయం

బాలలూ! ఆనందంగా ఆ మైదానంలో ఆడుకుంటున్నారా? ఊపల మర్రి నీడను ఉత్సాహంగా పాడుకుంటున్నారా? ఆటకు అందం పాటని, పాటకు పసందు ఆటని, మీకు బాగా తెలుసు. యుగయుగాలనుండి ఆ విశాలమైదానంలో, ఆ పెద్ద మర్రి నీడను ఎక్కడెక్కడి బాలలో చేరి, చక్కగా ఆటపాటలతో తమ కాలం, హాయిగా తీయగా వెళ్లబుచ్చుకుంటున్నారు. చీకూ చింతా ఎరగని స్వేచ్ఛాజీవులైన బాలలకు ఆటపాటలే అన్నిను.

అమ్మదొంగలు! నా చేతిలోవున్న వస్తువునప్పుడే చూచారు! ఒకరికొకరు చప్పున ఉప్పందించుకున్నారు. అన్నీ కట్టిపెట్టి అట్టె వస్తున్నారు. ఒకళ్లకంటె ముందు ఒకళ్లయి పంతాన పరుగిడుతూ వస్తున్నారు. త్రోసుకోకండి. తొందరపడకండి. అందరినీ పిలిచి యీ అందాల పుస్తకం చూపుదామని, దీన్నిగురించి చెపుదామని అనుకుంటున్నా. నే సరిగా పిలవక ముందే బిలబిల త్రోసుకు వస్తున్నారు. నాకు తెలుసు మీ మనసులోని మర్మాలన్నీ, మీయిష్టాలన్నీ.

అందరు నాచుట్టూ చేరండి వలయంగా. ఆ చిన్నిపాపలను ముందుకు రానీయండి. ఆవెనక పెద్దబాలలు నిలవండి. అందరూ యీ పుస్తకాన్ని ఏకకాలాన చూడండి. ఆపైన నామాటలు రెండు వినండి. అన్నా! అపుడే చూసేసింది యీ కన్న, మొదటి పుటలోవున్న బొమ్మను. 'అమ్మ, పాప' అంటోంది చూచి. అందరూ అమ్మను చూడండి. అమ్మ ఒడిలో అందాల పాపను చూడండి. మీరంతా యిప్పుడు అమ్మ ఒడిలో హాయిగా వున్నట్లు భావించుకుంటున్నారు కదూ?

ఈ బంగారు పుస్తకం పేరు 'బొమ్మరిల్లు'. ఇది నిజంగా బొమ్మరిల్లే. ఎంచక్కని మంచిబొమ్మలు, ఎన్నో ఎన్నో అందాలు చిందే బొమ్మలు దీనినిండా ఉన్నయి. ఇదొక పాటలపుస్తకం. మీకోసమే యీ పాటలన్నీ వ్రాసింది. పాటలంటే మీకమితానందం కదూ? అసలు మీరే పాటలు నిజంగా. ఈ పాటలు వ్రాసింది శ్రీ కవిరావు అన్నయ్య. అందరికళ్లూ అలా స్ఫురణతో మిలమిలమంటున్నవే? ఆఁ. మీరిదివరకే అన్నయ్య పాటలు బాగా చదివి వున్నారన్నమాట. ఇంకేం - చాల బాగుంది.

మీకోసం శ్రీ కవిరావు అన్నయ్య ఎంతో శ్రమపడి యీ పుస్తకాన్నింత అపరూపంగా తయారుచేశాడు. మీ యిష్టాలన్నయ్యకూ బాగా తెలుసు. అన్నయ్య వయసు చాలా

**

చిన్నదే. అయితే అతని ఉద్దేశాలుమాత్రం చాల పెద్దవి. ఆ వుద్దేశాలన్నీ మీకందించాలని మీకందరకీ వినోదం, విజ్ఞానం కలిగించాలని అతనికెంతో పట్టుదల, అభిలాష. పాటల కనువైన బొమ్మలతో పుస్తకాన్నీతీరున తేవడం అందరికీ సాధ్యమైన పనిగాదు. ఇలాంటి పుస్తకం వెలువడడం యీ మాగాణాన యిదే మొదలు. అందుకు అన్నయ్యదే ప్రథమ తాంబూలం. ప్రతిబాల హస్తంలో యీ పుస్తకం ప్రకాశించ గలదని, ప్రతిబాలకీ పుస్తకం ఆనందం, ఆత్మసంతృప్తి నీయగలదని విశ్వసిస్తా.

పాటకొక బొమ్మవుంది. పాట, ప్రకృతి అంతఃప్రవృత్తిని తెలిపితే, బొమ్మ ప్రకృతి బాహ్యతత్త్వాన్ని తెలుపుతుంది. పాటకు ఆట ఎట్టిదో, పాటకు బొమ్మకూడ. అట్టిదే. ఆటకూ, బొమ్మకూ అవినాభావ సంబంధముంది. చలించే (ఆడే) బొమ్మలు బాలలైతే, చలించని (కుదురుగావున్న) బాలలు బొమ్మలన్నమాట. ౪౩-వ పుటలో పేర్చిన మువ్వల్లా, కూర్చున్న గువ్వల్లా వరుసదిరివున్న బుజ్జినాన్నలు ముద్దులు మూటగట్టి నట్లున్నారు. చూచిసకొలదీ చూడ ముచ్చటవుతున్నారు. నాకనిపిస్తుందీ—'చిత్రలేఖకు లంతా, ఎప్పుడూ బాలల బొమ్మలే వేస్తే, కవులంతా బాలగేయాలే వ్రాస్తే ఎంత బాగుండును!' అని. బాలలగూర్చి ఏది చేసినా, ఏది వ్రాసినా, పవిత్రభావమే వుంటుంది మనసులో. మలినానికి మరి తావుండదు.

ప్రతిపాటలో ఒకభావం పరిమళిస్తోంది. ఆదిని అమ్మనుగూర్చి కమ్మని భావం. తరువాత తగిన శాస్తి, మర్యాదకు పోతే మట్టిగొట్టుకున్నట్లే, వేసందెచ్చే గ్రాసం, గాలి పడగ గర్వం, పేరుబట్టి పెద్దరికం రాదు, పాపకల, రామలింగని తెలివి, రాణించని చదువు, పిసనారి, అతని అల్లరి. కిలాడి, తాతకు తగిన మనుమడు, మొదలైనవెన్నో భావాలున్నపాటలు. (i) వేషం చూచి గ్రాసం ఘనంగా యిచ్చేలోకం, కష్టపడేవారికి కడుపునిండా గంజి పొయ్యదు. (ii) ప్రాణంపొయ్యే మానవుడేడ్చినా, కానీరాల్చని కటికలోకం, ప్రాణంలేని రాతిబొమ్మలకు, మాన్యాలిస్తానంటుంది. (iii) పైపేరున లేదు గొప్ప, లోపల ఘనతున్న తప్ప. (iv) పెద్దలు పెద్దలు ఢీకొంటే, పేదల బ్రతుకులు నుశియౌను. (v) అతని అల్లరి ఆటను తలపిస్తోంది. నలుపురూ నవ్వుతుంటే నాట్యమాడే స్వభావమతనిది. ఇలాంటి భావాలెన్నో మీకీపాటల్లో అందించాడు శ్రీ కవిరావు అన్నయ్య. మీరుమాత్రం మోసాలకి, రోసాలకి పాల్పడకండి. మంచివాళ్లు కాగలిగేలా మసలు కొండి. చక్కని భావాలను చక్కని శిల్పంతో మేళగిస్తేనే పాటలకు పసందు.

పాటకు లయ ప్రాణం. మీరంతా లయకు మక్కువ పడతారు. లయకు మీ తనూలతలు అటు యిటు ఊగి, తూగి ఒయ్యారాలు పోతవి. ఈ పాటలన్నీ లయబద్ధంగా

వున్నవి. లయ తప్పని ఫణితిలో పాటలు పాడుకుంటూ, అర్థాన్ని ఆస్వాదిస్తూ, ఆనందించండి.

మీరంతా తెలుగుబాలలు. మిమ్మల్ని వెలుగుబాటను నడిపించడానికి ఇలాంటి పుస్తకాలు విరివిగా కావాలి. మన దేశంయొక్క భావి భాగ్యోదయమంతా మీమీదే ఆధార పడివుంది. మిమ్మల్ని అర్థంచేసుకొని, మీకేది ఎందుకు కావాలో గ్రహించి దాని నాతీరున అందిస్తే, మీరెంతో గొప్పవారు కావడానికి అవకాశముంది. మీకు క్రమవిజ్ఞానం, వికాసం కలిగిననాడు, నేడు ప్రపంచాన్ని ఆవరించిన చీకట్లు, చీకాకులు తొలగిపోయి సర్వం కాంతివంతము, శాంతిప్రదము కావడానికెంతో అవకాశముంది.

నా శిరస్సున రత్నకిరీటమలంకరించినా, నేనది ఘనతగా భావించను. కాని బాలలతో పరిచయ భాగ్యమబ్బితే దానిని నేను మహదానందం, మహద్భాగ్యంగా ఎంచు కుంటా. శ్రీ కవిరావు యీ పుస్తకానికి ఒకటిరెండు పరిచయవాక్యాలు వ్రాయుమంటే నే నెంతో ఆనందించా. అతిశయించా. ఇదంతా బాలలతో పరిచయ భాగ్యమందడమేకదూ:

ఎప్పుడు పుస్తకాన్ని ఆమూలాగ్రం చూదామా, చదువుదామా, అని వువ్విళ్లూరుతున్న మిమ్మల్నిట్టే ఆపివుంచడం నాకు భావ్యంకాదు. ఇదిగో ముందు యీ పుస్తకాన్ని ఆ చిన్ని బాబుకిస్తున్నా. చదువురానివాడేమి చేసుకుంటాడనుకుంటున్నారుకదూ ? రంగు చూచి, రమ్యమైన బొమ్మలను చూచి, అతడెంతో గ్రహించగలడు, అసాధ్యుడు మీరంతా ఆ బాబు పుస్తకాన్ని పూర్తిచేసేపఱకు వేచివుండాలనుకుంటున్నారా ? అవుసరంలేదు. మీలాంటి కొన్నివేలమందికి సరిపడే పుస్తకాలిక్కడున్నవి. ప్రతివారూ ఒక్కొక్క పుస్తకం, పవిత్రమైన పుష్పంలా స్వీకరించి, దానిభావాన్ని నిలువునా అఘ్రాణించి తృప్తి నందండి. అరే ! అప్పుడే అందరి చేతుల్లో అమరినయి పుస్తకాలన్నీ, బాగుంది.

ఆలమూరు,
28-6-1953

బి. వి. నరసింహారావు,
డిపూ్యటి ఇనస్పెక్టరు ఆఫ్ స్కూలు్స,



# తోరణాలు

మొట్టమొదట నన్నీమాదిరి గేయ రచనకు పురికొల్పినది పూజ్యమిత్రులు కీ. శే. "కవిబ్రహ్మ" శ్రీ ఏటుకూరి వేంకటనరసయ్యాగారు. వారి ప్రోత్సాహంవల్లనే కొన్ని గేయకథలను "చందమామ"కు పంపించటం జరిగింది. వారు 'చందమామ'లో పిల్లలకు చక్కని గేయకథలు అందించారు. నరసయ్యాగారి మార్గాన్ననుకరించిన నా గేయకథల్లో యేమైనా మంచి వుంటే అది వారి స్నేహఫలమే అని చెప్పుతాను. అందుకే మా బొమ్మరింటికి వారి పేరుతో తొలి తోరణం కట్టుకొంటున్నాము.

'అనుదినం అందరూ వాడుకునే సామెత కథలే గదా, దీంట్లో నవ్యత యేముంది' అని మా కె. వి. కె. గారి వంటివారే ప్రశ్నించారు. వారు చెప్పింది కూడా యదార్థమే. కాని జాన్‌కీట్సు అన్నట్లు సర్వసాధారణ విషయాలను అందంగా చెప్పి అందరిని ఆనందింప జేయటమే అసలు గొప్ప. ప్రత్యేకించి యీ గేయాలు పిల్లలకు కాబట్టి దీనిలోని భావాలు వారి వారి అనుభవాలకు అందేలాగా వుండాలి. అప్పుడే పసిపాప లేత హృదయం పరవశత్వంతో పొంగిపోతుంది. అయితే యీ విషయంలో నే నెంతవరకు కృతకృత్యుణ్ణయ్యానా అనేది వేరే విషయం—

అనుదినం నా పురోభివృద్ధిని కాంక్షించే మిత్రులు పరుచూరి రామకృష్ణ, గరికపాటి వేంకటసుబ్బారావు, యాగంటి రామకృష్ణయ్య, జగన్నాథం గార్లకు ఈ సమయంలో హృదయపూర్వకంగా కృతజ్ఞత తెల్పుకొంటున్నాను. ఈ గేయకథల్ని గ్రంథరూపంలో తెచ్చుట కెంతో ప్రయాసపడి, తన పట్టుదల నెగ్గించుకొన్న ఆదర్శమిత్రుడు చలపతి రావుకు నా ధన్యవాదాలు.

'బొమ్మరిల్లు' తెలుగు బాల రచయితల సంఘ మొదటి ప్రచురణగా వెలువడటం నా అదృష్టం. ఆ అవకాశాన్ని కల్పించిన శ్రీ బి. వి. నరసింహారావుగారే కాక మద్దులూరి రామకృష్ణ, వేజండ్ల సాంబశివరావుగార్లను; ప్రసిద్ధ బాల రచయిత మిత్రులు 'బైరాగి'గారు సహితం నా సంతోషంలో భాగధేయులై యున్నారు. ఈ సంతోష సమయంలో అభిమానులకు కృతజ్ఞత తెల్పుకొంటూ మా బొమ్మరింటికి తోరణాలు కట్టుకొంటున్నాము.

సాహితీ కేంద్రం
రేపల్లె, 25-6-'53

కవిరావు

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | అమ్మ | ౧ |
| 2. | ఎత్తుకు పైయెత్తు | ౩ |
| 3. | పెళ్ళిపెద్దలు | ౬ |
| 4. | వేషమహిమ | ౧౦ |
| 5. | గాలిపడగ | ౧౪ |
| 6. | పేరుగొప్ప | ౧౬ |
| 7. | కొంటెప్రశ్న | ౧౯ |
| 8. | ఎండమావులు | ౨౨ |
| 9. | తుమ్మెద పెండ్లి | ౨౬ |
| 10. | పాపకల | ౨౯ |
| 11. | జోస్యము | ౩౧ |
| 12. | లౌకికజ్ఞానము | ౩౪ |
| 13. | పిసినిగొట్టు | ౩౭ |
| 14. | తెనుగుపాపలం | ౪౧ |
| 15. | నేను | ౪౩ |
| 16. | అతను | ౪౫ |
| 17. | తక్కువ తిన్నదెవరు ? | ౪౮ |
| 18. | కిలాడి | ౫౦ |
| 19. | తాతతో సరసాలు | ౫౩ |
| 20. | దూడమేత | ౫౮ |
| 21. | ఎద్దుల పోరు | ౬౦ |
| 22. | సంసారి సుఖి - సన్యాసి దుఃఖి | ౬౩ |
| 23. | అమ్మలక్కలు | ౬౬ |
| 24. | మాయదయ్యం | ౬౯ |

# అమ్మ



అందమైన చంద్రహారంబు కంటెను
సారె కంటె పట్టుచీర కంటె,
నన్ను ప్రేమించెడు నా తల్లి కంటెను
దైవ మెవరు నాకు ?—ధరణిలోన.

నన్ను మోసి, కష్ట నష్టాల భరియించు
కన్న తల్లి కంటె - ఘనులు గలరె?
ప్రాణమీయ సిద్ధపడు నమ్మ కంటెను
దైవ మెవరు నాకు?—ధరణిలోన.

ఆట లెన్నొనేర్పి - ఆడించి, పాడించి
ముద్దు వచ్చి లోన - మురుసుకొనును,
కన్నతల్లి కంటె - నిన్నుగా పాడెడు
దైవ మెవరు నీకు?—ధరణిలోన.

చద్ది కుడువ బెట్టి - చలువ బట్టలు గట్టి
పలక, బలపమిచ్చి - బడికి బంపి,
గొప్పవాని కాగ - కోరు తల్లికి మించి
దైవ మెవరు మనకు? - ధరణిలోన.



# ఎత్తుకు పైయెత్తు



అనగా, అనగా ఒక ఊళ్లో,
ఆలీ మగడూ ఉన్నారు,
చాలా కాలము గడువగ ఒకనా
డాలితొ మగడిట్లన్నాడు:

"ఇంకొక పెండ్లముపై కోరిక నా
కున్నది నీ వేమంటావే ?"

భార్య :

"ఒక మనుజున కొక భార్య'ని పెద్దలు
ఊరకె సెల విచ్చారండీ ?"

భర్త :

"పెద్దలు చెప్పారని నా కవే
సుద్దులు చెప్పగ చూస్తావే,
బహు భార్యల పెండ్లాడిన కృష్ణుడు
మహనీయుడు కాలేదంటే ?"

'అయితే సరి' లెమ్మనుకొని పెండ్లము
అప్పటి కేమియు అనలేక,
ఇద్దఱు భార్యల కోరే మగనికి
బుద్ధి చెప్పవలె ననుకొంది.

మఱియొక రోజున మగనితొ పెండ్లము
మాటల సందున యిట్లంది :
"మఱియొక మగనిని పెండ్లాడగ నా
మనసున కోరిక గలదండీ !"

మగడది విని "నీతస్సాదియ్యా !
తెగదిని పొగ రెంతెక్కిందే,

ఆడుది రెండవ మగనిని కోరే
ఆచారము మన కేడ్చిందా?"

భార్య:

"మగవారము గద మనకే మనుకొని
తెగ మాట్లాడగ తగునండీ?
పతు లైదుగురను గలిగిన ద్రౌపది
సతి కాదని మీ రనగలరా?"

నక్కిళ్ళయ్యకు పడి పాపమ్మిక
గుక్క త్రిప్పుకొన గాలేక,
"లెంపలు వేసితి వీక మాటలతో
చంపకె నీ పుణ్యా"మ్మనగా.

తగిన శాస్తి జరిగిందని పెండ్లము
తనలో సంతస మందింది —
తాడి తన్ను వారొకరుంటే
తలదన్నే వారింకొకరు.



# పెళ్లి పెద్దలు



పల్లెటూరి పెద్దలొక్క
పెళ్ళికేగ దలచిరి.
మైలుదూర మెట్లొ నడచి
రైలు నెక్క బోయిరి.

వారు పోవు 'రైలు' యింక
చేరలేదు స్టేషను.
ప్రక్కనున్న 'కేఫు' కేగి
ఒక్క దమ్ము తీసిరి.

దాపునున్న షాపు కేగి
పేప రొకటి బట్టిరి,
వచ్చిరాని వార్తలెల్ల
వలకబోయ సాగిరి.

పట్నమేగు రైలు వచ్చి
'ప్లాటుఫార్మ' చేరగ,
ఎక్కడున్న వార లక్క
డెక్కి నిండి పోయిరి.

'రిష్టువాచి' చూచి పెద్ద
లిట్లు తలచి రంతట;
"రైలు పోవ బొచ్చుడంత
'టైము' వున్నదింకను."

పెళ్ళిపెద్ద లిద్దరొక్క
బల్లమీద కూర్చొని,
చేతులూపి బల్లగుద్ది
చర్చ చేయ సాగిరి.

ఇంతలోనె రైలు పోవ
గంట కొట్టి వేయగ,
పెళ్ళిపెద్ద లపుడు రైలు
పెట్టె దరికి చేరిరి.

"ముందు మీర లెక్కు" డంచు
అందొకండు పల్కగ,
"కాదు కాదు, మీరె ముందు
కాలు పెట్టు" డనియెను.

'మీరు పెద్ద లెక్కు' డంచు
'మీరు పెద్ద' లంచునె,
వారిలోన వారు పెద్ద
వాదులాడ సాగిరి.

గంట మరల మ్రోగ గానె
గార్డు విజిలు వేసెను,
రైలు 'గుప్పు, గుప్పు' మంటు
బైలుదేరి పోయెను.

చేతగాని పెద్ద లంత
చేతులూపు కొంచును,
తోలుసంచి చంక బెట్టి
కాలిదారి బట్టిరి.

ఎక్కడెట్లు నడవ వలెనొ
ఎరుగ నట్టి నాపలు,
బెట్టు చేసి తువకు నోట
మట్టి గొట్టు కొందురు.



# వేషమహిమ



బక్కచిక్కిన ఒక్క
దుక్కిటెద్దును, యినుప
ముక్కుకాకుల దండు
ముసురు కొని వస్తుంటె,

అడుగు వేసిన కండ
లల్లాడు చున్న యొక
గంగిరెద్దు ద్దాని
గని మాటలాడింది :

"ఏమోయి మిత్రమా!
క్షేమమా?" అనగానె,
"చెప్పుకొంటే సిగ్గు
చెలికాడ నా బ్రతుకు.

కంఠ లఱుగగ యెంత
కష్టించుచున్న, మా
కాపు వానికి సుంత
కనికారమే లేదు.

బండ చాకిరి చేసి
పస్తులుండియు వాడి
వత్తినై, తుద కిట్టు
లెత్తుబడి పోయాను."

అనగానె గంగెద్దు
అందుకొని యిట్లంది:
"అవు నవును నీమాట
అక్షరాలా నిజము.

కోడె వయసున నన్ను
వాడ వాడలు త్రిప్పి,
బాడుగలు గుంజు కొ
న్నాడు మా యజమాని.

ముదిమి నాపై వ్రాలి
మూలబడి పోగానె,
దయలేని రైతు నను
తఱిమి పారేశాడు—

గంగి రెద్దుల వాడు
పంగనామా లెట్టి
రంగు రంగులు వేసి
హంగుల్లు తీర్చాడు.

ఊరూర నా వెంట
బూరూదు కొని వస్తె,
దేశమ్ము నను 'బసవ
దేవు'డని కొలిచింది.

హారాలు మేళాలు
హారతులతో నేడు,
ఊరూర కల్యాణ
ములు చేయుచున్నారు.

చూస్తివన్నా! యెంత
చోద్య మైనదొ జగతి?—
అంత రార్థమ్మిప్పు
డర్థమైనద? నీకు.

కష్టజీవికి పుట్టు
గతులు లేనే లేవు,
వేషధారణ చేయు
మోసగాళ్ళకె కూడు.

నీకు తోచిన రంగు
నీవు వేయక యున్న,
మాటి మాటికి రంగు
మార్చుచుండక యున్న,

జగతిలో నీ వింక
జీవించు టే సున్న.''
అనగ నాముస లెద్దు
విని తలూపుచు నుండ,

పుందులో నొక కాకి
పాడువగా ముసలెద్దు,
బాధ తాళగ లేక
పరువెత్తి పోయింది.





# గాలిపడగ



గ్రద్ద యొకటి ఆకసమున
ఆడు చుండగ,
గాలిపడగ దానిని ఎగ
తాళి చేయుచు,

"రెక్క లున్నవంచు పొంగి
పోవు చుందువు,
ఏమిలేకె నేను నీతో
ఎగర గల్గితి."

అనగ గ్రద్ద దానితోడ
అన్నడిట్టుల :
"ఏడ్చినావు లెస్తు తమరి
నెవ్వ రెఱుగరు ?

గాలి యున్న వఱకు యిల్లె
గంతు లేతువు,
గాలి పోవ గర్వ ముడిగి
నేల బడుదువు—"

ఇంతలోనె పెద్దగాలి
ఎత్తు కొచ్చెను,
పాడుగాలి హెచ్చి దాని
త్రాడు త్రెంచెను.

గాలి దెబ్బతోడ గింగ
రాలు తిరుగుచు,
గోలపెట్టి గాలిపడగ
నేల గూలెను.

పదవి దొరకగానె అల్ప
వెధవ లిట్టులె,
తన్ను తాను మఱచి కన్ను
మిన్ను గానరు.



# పేరుగొప్ప



పల్లెలో నొక పేద
తల్లి నివసించె, నా
యిల్లాలి కొక గడుసు
పిల్లవాడు న్నాడు.

ఆ తల్లి యొకనాడు
'అన్నంబు తిను'మన్న

'కాదు పెరు గన్నంబు
కావాలె' నన్నాడు.

'పేద వారికి మనకు
పెరుగెట్లు వచ్చు' నన
'ఆఁ ..ఆఁ—'లు సాగించి
ఆగడము చేశాడు.

"తోటి వారితొ మనకు
సాటి యెట్లాగురా!
కల దానితో తృప్తి
గాంచరా నా తండ్రి!"

కుఱ్ఱవాడు :

"దొడ్డిలో వుందిలే
తెలియ దనుకొన్నావు?"

తల్లి :

"చూచుకో, నీ కుంటె
దాచుకొంటా నటర?"

అనగానె కుఱ్ఱవా
డత్యంత మోదాన,
దొడ్డి లోపలి 'పెరుగు
దోట' మొక్కలు తెచ్చి,



3

''పెరుగున్న దిండులో
పిండి పో''యు మటంచు,
గారాల అబ్బాయి
మారాము చేశాడు.

పసివాని మాటలకు
పరవశ మ్మయి తల్లి,
అక్కునను జేర్చుకొని
ఒక్క ముద్దెట్టుకొని,

''పేరులో ఏముంది
పిచ్చితండ్రీ! వట్టి
బూటకమురా జగ
న్నాటక మ్మంత యును.

'పై పెటారమ్ము, లో
పల లొటారము' గాన,
పేర్ల ఘనతకు మోస
పోవద్దు నీ వెపుడు.''

అని తల్లి చెప్పగా
ఆశ్చర్యమును జెంది,
అలుక మాని అతండు
అన్నంబు తిన్నాడు.



# కొంటె ప్రశ్న



పంతుల య్యొక నాడు
పాఠాలు చాలించి,
'కథలతో యీనాడు
గడుపుదా' మన్నాడు.

'సరె' యంచు బాలురు
త్సాహంబుగా జేరి,
చీమ చిటు కనకుండ
చుట్టు మూగంగానె,

"పెద్ద వారల యందు
భక్తిగా మెలగవలె,
బాల భక్తుండైన
ప్రహ్లాదు డెప్పుడున్.

పెద్దల బొడగన్న
భృత్యుని కైవడి.
చేరి నమస్కృతుల్
చేయువా''డని చెప్పి,

భాగవతపు కథను
బాలురకు వినిపించి,
'బాగున్నదా?' యంచు
ప్రశ్నించి చూశాడు.

కూర్చున్న వారిలో
కొంటె బాలు డొకండు,
"సందేహ మొకటుంది
సార్! నా'కన్నాడు,

"తల్లి దండ్రియు గురువు
ధరణిలో ప్రత్యక్ష
దైవమ్ము, లని నిన్న
తమరె చెప్పిరి గదా?

తండ్రి చెప్పిన కన్న
తల్లి చెప్పిన వినక,
గురుని మాటలు గూడ
సరకు చేయగ లేదు.

పరమ పూజ్యుల మాట
పాటింపగా లేని,
ప్రహ్లాదు నకు యింక
పెద్దలెవ?" రనగానె,

పంతు లదివిని "ఓరి
కొంటె వెధవా! చెప్ప
దంటు ప్రశ్నలు వేయు
చుందు విల్లెప్పు" డని,

కసరి 'సిడ్డౌన్' అనుచు
కనులెఱ్ఱ చేయగా,
బిక్క మొగమున కుఱ్ఱ
వాడు కూర్చున్నాడు.



# ఎండమావులు



దప్పిచే ఒక దుప్పి
రొప్పుతూ రోజుతూ,
పడుతు పడుతూ ఎటకో
పరుగెత్తు చుంటేను,

దారిలో నక్కెదురు
పడి యిట్టు లంది:
"దుప్పి బావా! యేల
రొప్పు చున్నావు?"

దుప్పి:

"మాయదా రెండలకు
నోరెండె నోయి!
తపనచే వతలు 'తెప
తెప' లాడుతుంది.

అదు గదుగో కనుపించు
ఆ యేటిలోన,
వేవేగ ఒక బుటికి
వేసి రావాలి."

అని దుప్పి యెండ మా
వుల చూపగానె,
'పకు్క'మని నగి గుంట
నక్క యిట్లంది:

"కాదులే, పప్పులో
కాలేసి నావు—
నీరు గాదవి 'అగ్గి
పా'లోయి బావ!

కంటి ముందరి నీటి
గుంట విడనాడి,
దొరకన్ని నీటికై
పరుగెత్త నేల?"

దుప్పి :

"కుంటినా నీవలే
గుంట నీ ద్రావ?
పరుగెత్తి దానినే
పట్టు కొంటాను."

నక్క చెప్పిన దంత
టక్క రనుకొంది,
దాహమ్ముతో దుప్పి
దవుడు తీసింది.

పాప మా దుప్పెంత
పరుగెత్తు చున్న,
తన ముందుగల నీరె
దరికి రాకుండె.

అంత నది 'టక్కు' మని
ఆగిపోయింది,
నీరు గాదని అపుడు
నిర్ణయించింది.

తాను చేసిన పనికి
లోన చింతిస్తూ,
తూలిపోతూ దుప్పి
తుద కిట్టులంది.

"దూర సీమల నెవో
వరిగి పడునంచు,
పరుగు లెత్తుట కన్న
పొరపాటు లేదు."

దుప్పి తనలో నిట్లు
దుఃఖించి తుదకు,
దప్పి తీరకె యింటి
దారి పట్టింది.

మంచి చెడ్డలు విచా
రించుకొనలేక,
మూర్ఖులిట్లే మోస
పోవు చుండెదరు.





# తుమ్మెద పెండ్లి

కమ్మని వసంత కాలములో
తుమ్మెద కన్నియ పెండ్లంట;
రావలసిన వారొచ్చారు,
తేవలసిన యవి తెచ్చారు.

పోకుల గులాభి వచ్చింది,
రేకుల కోకలు తెచ్చింది.
మల్లెకుమారి వచ్చింది,
చల్లని వాసన తెచ్చింది.

అప్పుడె విచ్చిన కలువమ్మ,
పుప్పొడి గంధము తెచ్చింది.
ముసుగు తీసి మందారమ్మ,
తెచ్చెను మృదుమధు సారమ్ము.

బాజా భజంత్రీ లంత,
పందిరిలో చేరారంత.
పెద్దల పిన్నలతో గూడి,
పందిరి 'పెకపెక' లాడింది.

కోడిపుంజే లొక్కుమ్మడి 'కొక్కురు
కో'యని బాకా లూదినవి.
కప్పల గాంగులు 'బెకా, బెకా'
డప్పులు చేప్పుడు చేసినవి.

భోగము నెమలిది వచ్చింది,
భరత నాట్యమును చేసింది.
కొమ్మలలో కోకిల జంట,
కమ్మని గానము చేసింది.

బడాయి హంసలు పెండ్లి పెత్తనము,
హడావుడిగ సాగించినవి.
గోరువంకలూ, శుకములు మంగళ
హారతు లెన్నో పాడినవి.

గన్నెరు పూవులు తెచ్చిన తేనెలు
కట్నంగా చేదివించారు.
పూతపూచినా మామిడి, తుమ్మెద
జాతికి విందులు చేసింది—

ఒకపువ్వు మెడపై వరుడు, యిం
కొక పువ్వుపై వధువును చేరి,
ముసిముసి నగవులతో వారు
వసంత మాడగ సాగారు.

పుప్పొడి గులాము పెండ్లముపై
పెండ్లికుమారుడు చేల్లాడు.
పెండ్లము సిగ్గున తలవంచి,
పెనిమిటిపై తా చేల్లంగ,

క్రిందే పడిపోయినదంత,
అందరు పకపక మనిరంత.
పెండ్లి కుమారుండే గెలిచె,
పెండ్లి కుమారిత యోడింది;—

తుమ్మెద దంపతు లిటు తమతమ హృద
యమ్ముల దాచిన సమ్ముదము,
పుప్పొడి వలె యొక రింకొకళ్ళపై
గుప్పుచు వసంత మాడంగా.

ప్రేక్షకు లెల్లరు సంతోషముతో
పొంగి బోర్లబడి పోయారు.
గమ్మత్తులతో వేడుకగా
తుమ్మెద పెండ్లయి పోయింది.



# పాపకల



అమ్మ నే కల గంటి!
అర్ధ రాత్రాన,
అక్కయ్యా, బావ నా
కగుపించినారె.

అక్కయ్య నీళ్లాడె
అబ్బాయి కలిగె,
బాబుగాడే వాడు
బంగారు కొండ.

ముక్కు మొగములు అన్ని
అక్కయ్యవేనే,
బుద్ధి బాబుదె వంట
బట్టి నట్టుంది.

'అత్తత్త తాత' అని
అంటాడె వాడు,
బావ వలెనే పట్టి
బడాయి పిండె.

'నన్ను గన్నాతండ్రి
నారత్న!' మనుచు,
ప్రొద్దు గూకులు అక్క
పొంగి పోతుందె.

బావ మన ఊరునకు
బదిలియై వస్తే,
అబ్బాయి నెత్తుకొని
ఆడించు తానె.



# జోస్యము



రాయలవారి ఆస్థానములో
రామలింగ మొక డున్నాడు.
కొంటె చేష్టలను చేస్తాడు,
కొలువంతా నవ్విస్తాడు.

కొన్ని వత్సరా లిటు పోవగ, నొక
చిన్ని తమాషా జరిగింది.
'జోస్యం చెప్పెద' నంటూ అటకొక
జ్యోతిష్కుడు వేంచేశాడు.

తోచిన విషయా లేవో రాజుకు
'తూ. చా' దప్పక చెప్తుంటె,
'అవునవు' నంటూ రాజావారవి
ఆలకించేగా సాగారు ;—

వెండి పళ్లెరముతో కానుకలా
పండితునకు రాజిస్తుంటె,
'ఆగం' డంటూ రామలింగ మి
ట్లన్నాడా జ్యోతిష్కునితొ :

"అనుమానం బొకటున్నది పెద్దల
నడిగి తీర్చుకో వచ్చునుగా ?"
"తప్పేమున్నది నాయన! దానిని
చెప్పుము తీరుస్తా" ననగా,

రెండు చేతులతొ రామలింగ మొక
కండెపు రాతిని పైకెత్తి,
"స్వామీ! యిది మీ నెత్తిన పడవే
స్తానా? లేదా? సెలవిండు.

తప్పుడు జోస్యం చెప్పితివా ?—
తంతా జాగ్రత్త"న్నాడు.
రామలింగ మిట్లనగానె,
స్వామికి గంగిర్లెత్తినవి.

కండెపు రాతిని చూస్తుంటె,
గుండెలు నీరై పోయినవి.
బిత్తరపడి రాజావారు, నో
రెత్తలేక చూస్తున్నారు.

జోస్యుడు "దండం బాబూ! ఇక నా
జోలికి రాకం డంటూనే,
పచ్చడంబు చేలచెల్లగ గప్పుక
వచ్చిన దారిని బట్టాడు.

'పొట్టకూటి కేడ్చిన జోస్యమ్మిది
వట్టి అబద్ధ'మ్మనుకొంటు,
రామలింగని తెలివితేటలకు
రాయలు సంతోషించాడు.



# లౌకిక జ్ఞానము



శాస్త్రిగా రబ్బాయి



ఎదురు పల్కేవారి
నెక్కి రానీడు,
మాటకు౯ మాటతో
మాడ్చి వేస్తాడు.

పట్టణపు నీళ్లొంట
బట్టె కాబోలు,
పల్లెటూళ్లన్నచో
పరిహసిస్తాడు—

మద్రాసులో పట్ట
భద్రుడై పిదప,
వేసంగి సెలవలకు
వేంచేసినాడు.

అత్తగారింటి బెం
గెత్తె గాబోలు,
దూరానగల పల్లె
టూరు కేగాడు.

బస్తీల కోతలె
న్నో కోసి కోసి,
బావమఱదుల ప్రేమ
చూరగొన్నాడు.

శాస్త్రిగా రబ్బాయి
చేదువులంగూర్చి.
ఊరంత అట్టుడికి
నట్టు లుడికింది—

ప్రక్కింటి చంగయ్యా
ప్రాంశరీ నోటు,
లెక్క చూపించుకొన
తెచ్చె నొక నాడు.

శాస్త్రి కొమరుడు చాల
సేపు లెక్కించి,
చిట్టచివరకు నాత
డిట్టు లన్నాడు.

"వేయి రూప్యము లసలు
ఫాయిదా లండి!"
అనగానె చంగయ్యా
ఆశ్చర్యమంది,

"ముప్పదైదుకు మించి
మొత్తమవదండీ!"
అని చిటికెలో నోట
లెక్క కట్టాడు.

"గుడ్డిముండలు చేయు
వడ్డీకి, బావా!
గొప్ప చేదువులు చేదివి
తప్పుచేశావా ?"

మెత్తగా మఱచ లి
క్లైత్తి పాడువంగ,
శాస్త్రిగా రబ్బాయి
సిగ్గు పడ్డాడు.

లౌకిక జ్ఞానంబు
లోపించె నేని,
ఎంత చేపివిన లాభ
మేముంది మనకు?





# పిసినిగొట్టు



బేరాలాడే పేరయ్యా
కానీ లాభం కాసించి,
కొండమీది తిరునాళ్లకు కొబ్బరి
బొండా లెగుమతి చేశాడు.

అబ్బాకొడుకులు మూటలు గట్టుక
కొబ్బరి కాయలు మోస్తుంటె,
వడలో నడిచే కొడుకుకు నాలుక
పిడుచే గట్టుకొని పోతుంది.

"మంచినీళ్లు అవుతున్నవి నాన్నా!
కొంచెము కావా" లనగానె,
"కొండదరిని కోనేఱదుగో" నని
యెండమావులను చూపాడు.

నాలుగు బారలు పోయి కొమారుడు
"నాన్నా! దాహం," అన్నాడు.
"వాగుదరికి వస్తున్నాం బాబూ!
బేగా పరుగిడు" మన్నాడు.

"నడువలేను నాన్నా! నా నాలుక
పిడుచేగట్టుకొని పోతుంది,
బొండా మొక్కటి కొట్టివ్వవె నో
రెండుతున్న"దని యేడ్చాడు.

రెండణాల కాసించిన పేరయ
బొండం కొమరుని కివలేక,
"దగ్గఱకొచ్చాం బాబూ! యిచేటనె
బుగ్గబావి కల" దన్నాడు.

అదు గిదుగో నని పేరయ కొమరుని
అదిమి పట్టుకొని వస్తుంటె,
నాలు కెండుకొనిపోయి పాప మా
బాలుడు ప్రాణం విడిచాడు.

పేరయ లబలబ లాడుతు నెత్తీ
నోరు కొట్టుకొని యేడుస్తూ,
"పండుపంటి నా బంగారపు
కొండ లేచి కూర్చున్నయెత,

కొండమీది కోటప్పకు కొబ్బరి
బొండాలన్నీ అర్పిస్తా."
చూచారన్నా! లోకం బెంతటి
చిత్రంబైనదొ! యోచించి,

ప్రాణంపోయే మానవుడేడ్చిన
కానీ రాల్పని యీ లోకం,
ప్రాణం లేని రాతి బొమ్మలకు
మాన్యాలిస్తా నంటుంది.



# తెనుగు పాపలం

చెక్కు చెదరని మొక్కవోవని,
శిల్ప చాతురి వెల్లి విరిసిన,
శ్రీల దనరెడు తెలుగు తల్లికి
పాపలం, కను పాపలం, రేపటి
రూపు దిద్దెడు వారలం.

ఉగ్గుపాలతొ కదన పాండితి
నిగ్గు దేర్చెడు వీరమాతల,
తేనె లూరెడి జోల పాటల
లోన కుల్కిన వారలం, తేనెల
తెల్గు పల్కెడి వారలం.

బాలచంద్రుని, బ్రహ్మనాయని
బాహువిక్రమ ప్రతిభ చిందిన,
పావనంబగు తెలుగు తల్లికి
బాలులం, సుమ మాలలం, ఆరని
ఆంధ్ర శౌర్య జ్వాలలం.

కందుకూ ర్గురజాడ అప్పా
రావు, లక్ష్మణరావు లనియెడు,

చేవ దేలిన తెనుగు ధీరుల
కోవ లోపల వారలం, పెద్దల
త్రోవ త్రొక్కిన వారలం.

తిక్కనార్యుని దేశి కవితకు,
త్యాగరాయల తెనుగు గీతికి,
వేమనార్యుని ఆటవెలదికి,
నోచి పుట్టిన వారలం, పుణ్యము
జేసి పుట్టిన వారలం.

దత్తమండలి, తెలంగాణము
ఉత్తరు సర్కారు లనకను,
తెలుగు పాపల మొక్కలై మా
దేశభక్తిని చాటెదం, పుట్టిన
దేశమును ప్రేమించెదం.

జీవ నదులౌ కృష్ణా గౌతమి
పావనోదక పూరములచే,
సారమగు మాగాణముల బం
గారు పంటలు పండగా, సిరి మా
గాదె లన్నియు నిండగా.

విశ్వమానవ కోటిలో మా
వీరయోధుల త్యాగదక్షత,
పేరుపేరున చాటుకొని జయ
భేరి గొట్టుచు తిరిగెదం, వీరుల
వారసుల మనిపించెదం.

★

# నేను



కోడి కూయంగానె
మేలుకొంటాను,
మొదట పాఠములెల్ల
చదువు కొంటాను.

కాలకృత్యములెల్ల
గడుపు కొంటాను,
చలువ బట్టలు గట్టి
చద్ది తింటాను.

వడిగ వడిగా ముందు
బడికి పోతాను,
వచ్చిన పాఠముల్
వప్పగిస్తాను.

సందె జామున నేను
అందరితో కలసి,
అలుపు వచ్చిందాక
ఆడుకొంటాను.

బొ మ్మ రి ల్లు

వేడి నీటను స్నాన
మాడి వస్తాను,
భుజియించి పాఠాలు
చేదువు కొంటాను.

అమ్మ నా కిస్తుంది
అన్ని వస్తువులు,
నాన్న నా కుండంగ
నాకేమి లోటు ?

పాఠాలు రాకుండ
బడికి పోలేదు,
చెడు సాకులను చెప్పి
బడి మానలేదు.

జెగడ మాడగ బోను
పగవాడు లేడు,
తోడివారికి నేను
తోడు పడతాను.

మంచివా డంటారు
మాష్టారు నన్ను,
మంచివాడని మమ్మ
సంతసిస్తుంది.



# అతను



బారెడూ ప్రొద్దెక్కి
బడికి పోతాడు,
పాఠాలు రావంచు
బల్లెక్కుతాడు.

బాలు లందర గిల్లి
గోల చేస్తాడు,
గోడ కుర్చీ వేసి
కూరుచుంటాడు.

## బొమ్మరిల్లు

బడికి వేళకు రాడు
పాఠాలు వినడు,
అడ్డగాడిదలాగు
ఆడుకొంటాడు.

చెనటి వారలతోడ
స్నేహ మాతనికి,
పోకిరీ పనులంటె
పండుగాతనికి.

నలుగు రాతని జూచి
నవ్వుతుంటారు,
చెడ్డబాలుం డంచు
చీదరిస్తారు.

గుణము మంచిదిగాని
కుఱ్ఱ కుంకలను,
స్నేహంబునకు యెవరు
చేరగానివరు.



# "తక్కువ తిన్న దెవరు?"



శంభుశాస్త్రి శిష్యుడైన
'జంబు'గాని తోడ్కొని,
గొప్పవారి యింటి పప్పు
దప్పళాని కేగెను.

వడలు మొదలుగాగ పిండి
వంటలెల్ల బెట్టగ,
పొట్ట పగిలిపోవునట్లు
పట్టు బడిని బట్టిరి.

వళ్లు మఱచి శంభుశాస్త్రి
కళ్లు తేలవేయుచు,
ఈడ్చుకొనుచు 'జంబు'తోడ
యింటిదారి బట్టెను.

పావుకోళ్లు గలవొ? లేవొ?
పాదములకు తనకని,
మధ్యలోన గురువున కను
మాన మొకటి వచ్చెను.

నడ్డి వంచి చూడ బొజ్జి
అడ్డువచ్చి జంబుతొ,
"పాదరక్ష లున్నవేమొ
పారజూడు" మనియెను.

మెక్కి మెక్కి జంబుడసలె
దిక్కు తెలియకుండెను.
చూచి చూచి కొంతసేపు
చివరి కిట్లు చెప్పెను:

"కంటిచూపు కాను వరకు
మింటి వైపు చూచిన,
అయ్యావారి పాదరక్ష
లంతులేవు గురువరా!

వళ్లుమండి శంభుశాస్త్రి
పళ్లు కొఱికి యిట్లనెఁ :
"బండ వెధవ! పావుకోళ్లు
కొండ కెట్లు పోయెరా?"

"తమరికంటె తక్కువిపుడు
తిన్నదెవరు? గురువరా!"
శిష్యు డిట్టులనగ శంభు
శాస్త్రి విస్తుపోయెను.



# కిలాడి



పట్టణాని కేగు నొకఁ
పల్లెటూరి శాస్త్రులు,
కట్టమీద వెదకుచున్న
పొట్టి కుఱ్ఱవానితొ,

"వంగి వెతకుచుంటి వసలు
సంగతేమి? నాయనా!"

బాలుడు :

"ఉంగరంబు బాబయ!
ఊడిపోయె నిచ్చట."

శాస్త్రులు :

"పిల్లవాడ! నాతొ నీవు
కల్లలాడు చుంటివా?"

బాలుడు :

"కల్లగాదు, కల్లగాదు
తల్లితోడు బాబయ!"

శాస్త్రులు :

"వెదకి కొమ్ము పాపము
వెళ్లిపోదునే" నన॥

బాలుడు :

"చేయిపట్టి వేడుకొందు
సాయపడుము బాబయ!
సొమ్ము దొరకెనేని సెరిస
గమ్ము జేసుకొందము."

అట్టులనగ సమ్మతించె
అశగొట్టు శాస్త్రులు.

వంగి వెదకుచుండ ముద్దు
టుంగరంబు దొరకెను.
సంతసించి బాలుడంత
శాస్త్రితోడ యిట్లనెన్.

బాలుడు :

"అయ్యా! మీకు సగము భాగ
మియ్యవలయు నిజముగ,
ఏమిచేతు చిల్లిగవ్వ
యైన లేదు చేతిలో?"

శాస్త్రులు :

"వస్తువిమ్ము సగము సొమ్ము
నిస్తు నేనె నీ"కనెన్,
సమ్మతించి బాలుడు,
చేంక లెగుర వేసెను.

"ఏబది రూప్యములు దీని
వెల"యనంగ బాలుడు,
ఇరువదైదు రూకలిచ్చి
యింటికేగె శాస్త్రులు.

డాబుసరిగ దానిని ష
రాబు కీయ నాతడు,
గిల్టుదనగ శాస్త్రులు,
గ్రుడ్లు మిటకరించెను.





# తాతతో సరసాలు

తాత :

"బడి కాలస్యంగా పోతే,
చెడు పేరొస్తుం దబ్బాయి!"

మన్మడు :

"ఇంతగ నాతో చెప్పెదవే,
పంతులు చేసే దదేగదా!"

తాత :

" పంతుళ్ళకు శ్రద్ధుంటేగా
పిల్లలు చెడిపోకుండేది—
'చేదవేస్తే మతి పోతుం'దని మరి
సామెత చెప్పే దండులకే. "

*

తాత :

" పేకాటాడకు మబ్బాయి!
పోలీసులు దండిస్తారు. "

మన్మడు :

" క్లబ్బులలో ప్రత్యక్షంగా
డబ్బాటాడే పెద్దలనో ?"

తాత :

" నిజమంతే లెమ్మబ్బాయి!
నిన్నని లాభమ్మేముంది ?
పెద్దపెద్దలే చేస్తుంటే
పిల్లలు చెడిపోకుంటారా!"

*

" అన్నివేళలా చేదువకు మబ్బాయ్!
ఆరోగ్యము చెడిపోతుంది. "

మన్మడు :

"చేదువకుంటె కొడుతుంటావు
చేదివితె తప్పంటుంటావు !"

తాత :

"ఆటలాడు సమయమ్మున పరులతొ
మాటలాడు సమయమ్ములలో,
భుజించు వేళల పుస్తక పఠనము
త్యజించవలె సుమ్మబ్బాయి !

*

"సత్ప్రవర్తనము, లౌకిక జ్ఞానము
చేదువుకంటె ముఖ్యమ్మబ్బాయ్ !
సంస్కారము లోపించిన యెంతగ
చేదివిన లాభము లేదయ్యా !"

*

మన్మడు :

"దేశమ్మును ప్రేమించాలందురు
దేనికి చెప్పుము తాతయ్యా !"

*

తాత :

"దేశమ్మంటే మట్టికాదురా
దేశమ్మంటే మనుజులెరా !
తోటి నరుని ప్రేమించాలని యీ
మాటల కర్థమ్మబ్బాయి !

మన్మడు :

"గుళ్లోకెందుకు తాతయ్యా!
వెళ్లొస్తుంటా వెప్పుడును ?"

తాత :

"పాపాలను మన్నించేమని
భగవంతుని ప్రార్థించుటకు"

మన్మడు :

"ప్రార్థన చేసెడు వారంతా
పాపము చేసెడి వారేనా!"

తాత :

"తాతకు దగ్గులు నేర్పెద వౌరా!
నీతులు చెప్పగ నా తరమా ?"

మన్మడు :

"బాలకులంటే యేమనుకొన్నావ్
భారత పౌరులు తాతయ్యోయ్!"





# దూడమేత

అబ్బరాజుగారి
కొబ్బరీ తోపు,
తఱుగు లేకుండంగ
విఱుగ గాచింది.

చలమయ్య దీన్నెట్లు
తెలిసికొన్నాడొ,
కాజేయ పలెసంచు
కాచి యొకనాడు,

చీకటీ పడగానె
చలమయ్య పోయి,
గబగబా యొక చెట్టు
కెగ బ్రాకినాడు.

కొబ్బరీ చెట్టుపై
కొలుపు తరాడు.
అంతలో అబ్బరా
జట కేగువెంచి,

"చెట్టెందు కెక్కావొ
చెప్పరా చలమ!
డొక్క చీలిచి నిన్ను
డోలు కట్టేను."

అనగానె చలమయ్య
హడలి పోయాడు,
మాఱు చెప్పంగ తిక
మకలు పడ్డాడు;

ఎట్టకేలకు నాత
డిట్టు లన్నాడు:
"అదిగాదు నామాట
ఆలించు బావ!

ఎల్లావు దూడొక్క
టేడ్చింది నాకు,
తెల్లవార్లూ మేత
కల్లాడుచుండె.

దూడ మేతేమైన
దొరకునని బావ!
గబగబా చెట్టెక్కి
గాలించు చుంటి."

గు

"దొంగ వెధవా! మేత
దొరకెనా? పైన"
"అందుకే దిగివచ్చు
చుంటి నిదుగో" అని

'జఱ్ఱు' మని క్రిందికి
జాఱి వచ్చాడు,
'తుఱ్ఱు' మని ఆవలకు
దూసుకొన్నాడు.

తప్పు చేసియు దాని
కప్పి పుచ్చుటకు,
కుంటి సాకులు చెప్పు
చుందు రీరీతిఁ.

# ఎద్దుల పోరు



అముకెడ్లు రెండు గలవు
అడవి లోపల,
కట్టి దొకటి, ఎట్టి దొకటి
కండ పుష్టితొ.

కట్టి దెపుడు లాభములకె
కవరలాడును,
ఎట్టి గిత్త యెదిటి దాని
నెక్కనీయదు.

ఎట్టిదాని వాసనన్న
కట్టి దోర్వదు,
కట్టిదన్న వళ్లుమండు
ఎట్టిదానికి.

ఏక చక్రముగను అడవి
నేల జూచుచు,
ఎట్టి గిత్త, కట్టి కోడె
వేచి యుండెను —

అంకె వైచి, కాలు నేల
రాచి రెండును,
తోకలెత్తి యొక్కనాడు
తారసిల్లెను.

దిమ్మతిరిగి పోవ రెండు
కుమ్ములాడగ,
గుద్దులాట కదరి అడవి
దద్దరిల్లెను.

పాలుపోక చూచుచున్న
అలమందలు,
పోరునాప దానిలోన
పాలుగొనియెను.

అముటెద్లు రెండు కుమ్ము
లాడుచుండగ,
నడుమనున్న అలమంద
నలిగి పోయెను.

గొప్పవారు పోర, కొద్ది
కొద్ది వారలు,
నడుమనున్న యెడల సర్వ
నాశ మగుదురు.





# 'సంసారి సుఖి—సన్యాసి దుఃఖి'



గంగన శ్రేష్టి సత్రములో
దొంగ సాధువొక డున్నాడు.
ప్రొద్దుగ్రుంకు సమయమ్మునకే
ముద్ద నడుక్కొని తినుచుండు.

ఇది యిట్లుండగ ఒకనాడు
ఈదర గొట్టగ సాగింది.
చిటపట చినుకులతో ముందు
చిన్న జల్లు పడసాగింది.

సాయంత్రానికి సన్యాసి,
సత్రం పంచేకు చేరాడు.
గుంజె నానుకొని సన్యాసి,
గంజాయ్ దమ్ము తీశాడు.

గందరగోళంగా రైతుల్
కొందరు అటునిటు పరుగెత్తి
కొట్టాములలో తమ గొడ్లు
కట్టి వేసుకొన సాగారు.

చూరు క్రిందగల సన్యాసి
చూస్తూనే కూర్చున్నాడు.
తడిసే సంసారుల జూచి
తానిట్లని తలపోశాడు.

" ఎండకు వానకు సంసారి
బండెడు చాకిరి చేయాలి,
యోచిస్తే సన్యాసి సుఖి, ఆ
లోచిస్తే సంసారి దుఃఖి "

ఇంతలోనే గాలీవాన
ఇంతింతై మరి అంతయ్యెన్.
గాలీ వానల ధాకలకు,
గంగన సత్రము కూలింది.

చెలిలో పాపం సన్యాసి
చావ సిద్ధమై యున్నాడు.
చచ్చే చచ్చే సన్యాసి
చావు తెలివితో అన్నాడు.

"అస్తమానమూ వేసారి,
హాయిగ సుఖపడు సంసారి.
కష్టము చేయంగను రోసి,
నష్టము లొందును సన్యాసి".



# అమ్మలక్కలు



ఊరుకు తూరుపు కోనేట్లో,
ఉదకము తెచ్చే టందుకని,
అస్తమాన మయ్యేవేళ,
అమ్మలక్క లటకేగారు.

పాలుపోక ఆ ముత్తైదుల్
గాలి కబుర్లు సాగించారు.
మాటల సందున ఒక వనిత
తోటిదానితో నిట్లంది:

"పిన్నీ! పిన్నీ!! విన్నావా, మీ
అన్నయ్యెంత సమర్థుండో?
వ్రాయగ మొదలిడి నారంటె
రవ్వలు రాలిచి పోస్తారు.

ఎవ్వరు కొరగానీ కున్నా
ఎంత వ్రాతగాడనుకొన్నా?"—
ఇంతలోన నీళ్ళందుకొనె
పంతులు పెండ్లా మిదివింది.

"అల్లాగయితే కల్లాలా!
అందరు చదివేదొక వ్రాలా?
గొలుసు కట్టుతో మావారు
గరగర వ్రాసే శారంటే,

వ్రాత తెలుసుకోవాలంటే
తాతలు దిగి రావాలింక."
ప్రక్కను గల మరియొక భామ
'పకపక' నగి యిట్లందుకొనెన్.

"ఈయనె గొప్పనుకొంటే, యిక మా
ఆయన నేమనుకోవాలి?
మా యాయన వ్రాసిన వ్రాత
తనకే తెలియదు తర్వాత."

ఇత్తరి నాబిడ చెప్పంగ
చిత్తయి పోయారందరును.
'అదృష్టమంటే అమెదెలె'మ్మని
అమ్మలక్క లనుకొన్నారు.

అచ్చర మంటే తెలియక మిడికే
అమ్మలక్కలీ విధిగానే,
కోతలుగోసే మగలను జూచుక
గొప్పగలారను కొంటారు.



# మాయదయ్యం



సంతకు బోయిన 'గురవయ్యశ్రేష్టి'
ఇంటికి పయనం పట్టాడు.
కొంత దూరము పోయేవరకే
పొంతముగా ప్రొద్దోయింది.

బిక్కు బిక్కుమనుకొంటూ ఆతడు
ఒక్కడె పయనమ్మయినాడు,
బక్కచిక్కినా చంద్రుడు తూరుపు
దిక్కున చల్లగ పొడిచాడు.

గుడ్డి వెలుగు లో గుండెలు పట్టుక
గురవయ'గునగున' పోతుంటే,
వెనుక ఎవ్వరో నడచి నట్లుగా
వినికిడి చెవులకు సోకింది.

దయ్యాలంటే శెట్టికి పాపం
భయ్యము చిన్నప్పటినుండి.
తడబడుతూ పడుతూలేస్తూ
వడివడిగా పోసాగాడు.

అన్నిభయాలకు అమోఘాస్త్రము
ఆంజనేయ దండక మనుకొంటు,
గురుతొచ్చిన నాలుగు ముక్కలె
మరల మరల వల్లించాడు.

మనసు నిలువక పోతూ పోతూ
వెనక్కి మళ్ళీచూశాడు.
దయ్యము తనుముకు వస్తోందని గుర
వయ్యకు ఋజువై పోయింది.

'చేసేదే'మని పాపము గురవయ
శ్రేష్ఠికి గంగిరలెత్తినవి.
నోరు చేసుకొని తిట్టినచో అది
పారి పోవునని తలచాడు.

"భడవా! ఎక్కడి కొస్తావే?' అని
చెడమడ చివాట్లు పెట్టాడు.
"దుంప దెంపుతా జాగ్రత్త!" అని
ధూము ధాములను చేశాడు.

సిగ్గులేని ఆ దయ్యం అట్లే
చూస్తూ నిలబడి పోయింది.
'దెబ్బకు దయ్యం జడిసే' విషయం
దబ్బున గుఱుతుకు వచ్చింది:

'కొంకులు విరగగ వేస్తా'నంటూ
కంకర రాతికి వంగాడు.
శెట్టితొ పాటా దయ్యంకూడా
గుట్టమీదనే వంగింది.

నిశ్చేష్టుండై 'అరరే యిది నా
నీడేనా!' అనుకొన్నాడు.
"అనుమానం పెనుభూతం, ఇంతకు"
అంటూ యింటికి పోయాడు.





**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B114 |
| పుస్తకం పేరు | బొమ్మరిల్లు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | XIV |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Akshaya |
| పేజీలు విడదీసినది | THASIN |
| Scan | Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |